తమకు బాగా ప్రకృతివైద్యము తెలియును అని చెప్పు కొనే వేలాది మానవులను నేను కలుసుకోవటం తటస్థిం చినది. వారందరును వ్యాయామము, ధ్యానచికిత్స, ప్రా చ్యవేదాంతము, దివ్యజ్ఞానము మొదలగు శాఖలకు చెందిన వారు. ఆ వేలాదిపండితులలోను నిజంగా వక్ష్యోపవాసము చేయుట కర్హులైనవారు సరీగా 20 మందికూడ లేరు. ఒకని. యర్హత ఒకరు నిర్ణయించుట ఆలాగే ఉండుననుకోండి. అయినప్పటికీ యేదైనా ఒక సిద్ధాంతమును వ్యాప్తి చేయ దలచినవారుగాని, ఆ సిద్ధాంతమునందు అభిమానము గలవారుగాని సమబుద్ధి కలిగియుండు టరుదు. ఆ సిద్ధాం తమునందు వ్యాప్తిచేసే ఆవేశములో వారు సమస్థితిని కోల్పోవుదురు.

కేవలం సత్వగుణసంపన్నుడైన జ్ఞానిగాగాని, రజో గుణ ప్రధానమైన మానవుడుగాగాని తమోగుణ ప్రధాన మైన పశువుగాగాని ఉండగలవా ? నీ కందుకు తగిన సాహసమున్నదా ? అప్పుడే వక్ష్యోపవాసము చేయుటకు నీకు అర్హత వస్తుంది. అనగా దేహము పని దేహము, మనస్సుపని మనస్సు, హృదయముపని హృదయము, నేని కవి జాగ్రతగా చేయగలిగి యున్నయెడల వక్ష్యోపవా సము చేయుట ఉపయోగముగా నుండును. ఏవి యెట్లు న్నను సాహసముతో కూడిన వక్ష్యోపవాసము చేసియే తీరవలయునని నీ అంతర్వాణి ధైర్యంగా ప్రబోధించిన యెడల వక్ష్యోపవాసము చేయవలసినది. . శాశ్వతంగా మేలును పొందండి. తత్కాల ఉద్రేకానికి వశుడవై మనస్సు దేహము మొత్తో అని మొత్తుకొనుచుండగాసంశ యములో మాత్రము వక్ష్యోపవాసము ఆరంభించ కండి. వక్ష్యోపవాసమువలన కలిగేవి 3 ప్రయోజనములు.

1 ఆత్మశుద్ధి, 2 ఆత్మశక్తి, 3 ఆత్మజ్ఞానము. వీనితో కలిసివచ్చేది ఆత్మానందము. అది పై మూటిని కలుపు

తుంది. అన్నిటిలోనికి సమీపములో నున్నది ఆత్మశుద్ధి. దీనిని సంపాదించుటకు అనేక ఉపాయాలుగూడ నున్నవి. వ్యాయామముచేసి చెమట పోయించుకొని రోగము నయము చేసికొనవచ్చును. జలచికిత్సతోను అదే ప్రయోజనము గూడ వచ్చును. కశేరుకాచికిత్సతోను ఆరోగ్యమును పొందవచ్చును. ధ్యానచికిత్సతోగూడ ఆరోగ్యము పొందవచ్చును. నీదేహనిర్మాణము నీదేహములో శేషించిన ధాతుశక్తి నీవుచేపట్టిన చికిత్స నేర్పుగాను శ్రద్ధగాను అవలంబించు ఓర్పు వీనినిబట్టి నీకుఆరోగ్యము కలుగుతుంది. పై చికిత్సావిధానములన్నియు నిన్ను అంతవరకు తీసికొనివచ్చి అక్కడనే వదలిపెట్టును. ఆత్మశక్తి, ఆత్మజ్ఞానము, ఆత్మానందము అనునవి యీ చికిత్సా విధానములకు తెలియవు.

ఇక వర్ణ్యోపవాసము స్వభావమేమి ? అది చాల వేగము, బలముగల మోటారుకారు వంటిది. మిగతా చికిత్సావిధానము లేవియు వడ్డికలోను సన్నద్ధతలోను అనుకూల్యతలోను వేగములోను వర్ణ్యోపవాసమునకు యీడుగావు. వర్ణ్యోపవాసమునందు మోటారు ప్రయాణమునందువలెనే ప్రమాదమున్నది. ఇతర చికిత్సా విధానాలకంటె యెక్కువ సాహసము త్యాగముకూడ ఉండవలెను. ఎద్దుబండి నెక్కినవానికి ప్రమాదభయము లేదు. ఒకమోటారుకారుమీద ఒకమైలుదూరము పోవలెనంటే ఒక నిమిషము కాలము సరిపోతుంది. అదే ప్రయాణము యెద్దుబండిమీద 20 నిముషాలు పట్టుతుంది. ఎక్కువ వేగముగా పోతుందిగనుక మోటారు ప్రయాణము యెక్కువ ప్రమాదముతో కూడుకొని యున్నది. నీ మోటారును నీవే నడుపుకొనగలిగిన

నీ క్షేమము నీ స్వాధీనములో నుటుంది. నీగమ్యమేదో, ఏ త్రోవను పోవలెనో, యెక్కడెక్కడికి పోవలెనో ఏయే మలుపులు తిరుగవలెనో నీకు బాగుగా ముందుగనే తెలిసియుండవలెను. నీ మానవయంత్రము యొక్క శక్తియొక్క న్యూనాధిక పరిమితికూడ నీకు తెలిసియుండవలెను. ఆ యంత్రము నీకు స్వాధీనముగా నుండి నీ వశములోనే అది నడచుననే నమ్మిక ఉండవలెను. లివరుమీద చెయ్యి, మార్గముమీద దృష్టి, గమ్యముమీద హృదయము, నిలిపి యుంచగలిగిన యెడల వేగవంతమైన వక్ష్యోపవాసము అను వేగముగల ఈమోటారు కారును చేపట్టుము. అయితే దీనిమూల్యము మరిచిపోబోకుము. వెల స్వల్పము. ఫలమధికము అనేది యెక్కడా ఉండదు. సత్యముయొక్క విలువ నాకన్న యెక్కువ తెలిసినవారులేరు. నాకన్న సత్యమునకె ఎక్కువమూల్యము చెల్లించినవారుకూడ లేరు. బంధనలోనున్న ఒక్క జీవాత్మను విడుదల చేయుటకై నాకన్న తక్కువ అవసరమున్నవారున్నూ ఉండరు.

2 వ ని య మ ము :—

లోకములో ఉపవాసాలు చేయువారు చేసే తప్పులేవో ముందుగానే వివేచన చేయుము.

బుద్ధిపూర్వకముగ్గాను సముచితమైన ఉత్సాహముతోను మొదటి నియమమును ఉల్లంఘించిన తరువాతనే నీవి రెండవ నియమము అవలంబించవలసినది. సత్యముపై నిరంతరము అహంకారమనే మాయ ఆవరించుకొని యుంటుంది. డివి, మెక్ ఫెడన్, జస్టు, ఎడ్డీ, ప్యూరిం

టన్ మొదలైనవారు జీవాన్ని గూర్చి సుందరమైన సిద్ధాంతాలుచేశారు. అవి మనకు అభ్యసించుట కనువుగా నుండవచ్చును, లేకపోవచ్చును. ఆ సిద్ధాంతము చదివి స్వబుద్ధితో యోచించి మనము యెంతవరకు దానిని అవలంబించగలమో యోచించుకోకుండానే ఆ యా సిద్ధాంతములను వ్యాప్తిచేసినవారు చూపించిన మార్గమును అవలంబించునప్పుడు మనము ఆమార్గమునకు తగియుండని యెడల మనకు చిక్కు కలుగుతుంది. దిగ్భ్రాంతులమగుదుము. పథ్యము, వ్యాయామము, వేదాంతము, చికిత్సా విధానము మొదలగువానిలో వైరుధ్యములు ఈ విధముగానే వచ్చుచుండును. నాకు ఒక విధానము ఉపయోగించినయెడల నీకుగూడ అవిధానమే యింకొక విధముగా ఉపయోగించినయెడల మేలు చేయవచ్చును. మోటారుకారు మంచిదే. కాని నడిపేవాడు మంచివాడు కానిచో ప్రమాద మున్నది. నేను మంచివాడినని కొంతమాత్రముచేత నేను చెప్పే సిద్ధాంతము సత్యమైనదైతే నీవు స్వీకరించుటకు అభ్యంతరముండకూడదు.

## ఇంక వివరములు

ఏదైనా ఒక క్రొత్తసిద్ధాంతమువచ్చినప్పుడు దాన్ని ఔదార్యముతో వివేచన చేయవలెనేగాని క్రొత్తదనే కారణముచేత వదలివేయ కూడదు. నిష్కారణముగా నేరము మోపకూడదు. అప్పుడే నీకు వివేకము, ప్రేమ ఉన్నట్లు ఔతుంది. ప్రేమ వివేకము రెండూ లేకపోతే కనీసము ప్రేమవున్నా మనము సత్యాన్ని స్వీకరించనే స్వీకరింతుము. నిగ్రహముగా వివేచనచేసి సత్యమంటే స్వీకరిద్దాము లేకపోతే వదలివేద్దాము.

సామాన్యముగా ఉపవాస చికిత్సకులు చేయు పొర పాటు ఒకటున్నది. అన్నిరోగములు ఉపవాసముతో పోవునని విశ్వాసము. సర్వరోగ నివారిణి ఒక్క జ్ఞానము మాత్రమే. జ్ఞానదాయకు లైనవారు చాల స్వల్పంగా ఉంటారు. వారు తాము వైద్యులమని ఎప్పుడు చెప్పుకోరు. తాము చేసిన జ్ఞానదానమునకు ధనరూప మైన ప్రతిఫలమున్ను కోరరు. తెలివిగా నిదానము చేస్తే సర్వరోగములకు మానవ స్వభావములోని వైప రీత్యమే కారణమని మనకు తెలుస్తుంది. ఆ దుష్ట స్వభా వము పోయిననేగాని రోగము నిజముగా నయముగాదు. అందువల్లనే కోప తాపాది స్వభావములు గలవారిని నేను సామాన్యముగా వక్ష్యోపవాసములో ప్రవేశ పెట్టను. వక్ష్యోపవాసము చేయునప్పుడు యెంతో శక్తిని జాగ్ర త్తగా కాపాడి మిక్కిలి వివేకముతో తగుమాత్రం వ్యాయామ చేయవలసివచ్చును. ఎంతో నిగ్రహము సమ బుద్ధి ఉండవలెను. దీర్ఘోపవాసముచేస్తే హాల్ కేయిన్ నష్టపడవచ్చును. ఆల్‌ఫ్రెడ్ హెన్రీలెవిస్ మేలుపొంద వచ్చును. జాన్ డి. రాక్‌ఫెల్లర్ చాల మంచివాడు. అయితే ఆతనివద్ద సరిపోయిన ధాతుశక్తియును లేదు. ఆత డాత్మవిదుడున్నూ కాడు. అందువలన అతనికి వక్ష్యోపవాసము పనికిరాదు. థియొడర్ రూజ్‌వెల్ట్ వక్ష్యోపవాసము చేసినయెడల అత్యంత వేగముతో గూడిన అతని స్వభావము సమస్థితికి వచ్చును. విశ్వాసము లేనివారు ఉపవాసమును నిరాకరింతురు. లేదా యెప్పుడో చేయుదమని కాలము పుచ్చుచుందురు. దేహ ములో మాంసము లేకపోయినను క్రొవ్వెక్కియున్నను వక్ష్యోపవాసమునకు తగరు. దేహమున ధాతుశక్తి లేక

పోయినను, ధాతుశక్తి చాలా ఆలస్యముగా చేరుకొను చుండినను వత్యోపవాసమునకు తగరు. మనోబలము లేక పోయినను బయటిపరిస్థితులు అనుకూలముగా లేకపోయినను వత్యోపవాసమునకు తగరు. ఏవిధమైన లోటుపాటు లుండినను ముందుగనే తెలిసికొని అవి లేనియెడలనే వత్యోపవాసము ఆరంభింపవలసినది. ఒకమాటు అరంభించిన తరువాత అన్నిలోపములను మరచి జరుగబోవు అభ్యుదయము నెంచి ఉపవాసము సాగించవలయును.

ఉపవాసములో ఇంకొక పొరపాటుగూడ జరుగుచుండును. రోగనివారకంగా ఉపవాసము చాలకొద్ది పని మాత్రమే చేస్తుంది. అది దేహమాలిన్యములను వెలువరిస్తుంది. మల, మూత్ర, స్వేద, కఫములుగా దేహమునుండి ఆయా అవయవముల ద్వారా దేహమాలిన్యములు వెడలిపోవుటకు వానిని చేతో వంతములుగా నుంచవలెను. ఆహారము మానివేసిన తోడనే జీర్ణమండలములో మాలిన్యములు చేరి మాంద్యము యేర్పడుతుంది. ప్రత్యేక శ్రద్ధ తీసికొనకపోతే దీనివలనకూడ ప్రమాదము వస్తుంది. ఒక సుప్రసిద్ధుడైన ఉపవాసవైద్యుడు ఒక రోగిని రెండు వారములు ఉపవసింపుమని సలహా యిచ్చినాడు. ఆ రోగి సమ్మతించి ఆహారము తినటం మానివేసినాడు. అంతే. తొమ్మిది దినములవరకు అతని ప్రేగులలో కదలిక లేదు. అందుకు ఏమీ ప్రయత్నము జరుగలేదు. రోగికి దిగులు పట్టుకుంది. ఉపవాసమువలన కలుగదగిన మేలంతయు దానితో తల్లక్రిందులైనది. ఆ తలతిక్క వైద్యునకు ప్రేగులలో కదలిక తెచ్చుటకు అవసరమైన మర్దనయందు నమ్మిక లేదు. దౌర్బల్యము వచ్చినను భయముచేత

ఎనిమా చేయింపలేరు. ఇక మిగిలినది సైతాను ప్రక్రియ మలమెూచ నౌషధములు. అతను చికిత్సలో చేసిన పొర పాటువలన సిద్ధాంతానికి మోసము వచ్చినది.

3 వ నేరము యింకొకటున్నది. చికిత్సాకాలములో వచ్చే స్వాస్థ్యసంకటములందు రోగి సహజపరిజ్ఞానముతో కొన్ని తాత్కాలికోపశాంతులు చేసికొనవలసియున్నది. ఎంత నేర్పుగా యిచ్చినను యితరులసలహా యే మాత్రమైనను అపకారముకూడ చేయవచ్చును. నా అనుభవము నీది కాదు. నీ యనుభవము నాది కాదు. అదివరకెల్ల అణచి యుంచిన వాంఛలు, దాగియున్న సహజ పరిజ్ఞానములు వస్త్రోపవాసములో మేల్కొంటవి. మానవమాత్రులు వానిని ముందుగా గుర్తుపట్టలేరు. నేను చేసిన పద్ధతినే నీవుగూడ ఉపవాసముచేస్తే తప్పకుండా ప్రమాదము వస్తుంది. వెనుకటి అనుభవములు చాలవు. అనుభవజ్ఞాని విర్ణతమైన నియమాలు యిక్కడ కలియవు. నిర్వివాద మైనవి అనుకున్న అనుభవాలుగూడ భావిసూచన చేయజాలవు. ఇప్పుడు రోగి కేవలం జగన్మాత చేతిలో నుంటాడు. సర్వము దేవునియందు భారముంచి ప్రకృతి మేలే చేస్తుందని నమ్మికతో సాగిపోవలెను. భౌతిక శాస్త్రజ్ఞులు యేమి చెప్పినను దేవుడు ప్రకృతి యెవరిని అన్యాయము చేయవు. జ్యోతిష్కుడు దూరదర్శినితో ఆకాశమును చూచుచున్నను చూడకున్నను సూర్యుడు ప్రకాశించుచునే యుండును. భౌతిక శాస్త్రజ్ఞులకు ఆత్మసంగతి యేమి తెలియును? వారికి కనపడనంత మాత్రముచేత నీకది ఆత్మకాకుండా మానుతుందా? మానవశిశువులు దానిని గమనించనంతమాత్రమున దివ్య

మైన శక్తి తన వైవిధ్యమును ప్రదర్శించి ప్రభుత్వము నీకు మేలుచేయకుండా మానుతుందా!

ఈ క తప్పేమనగా ఆత్మ వికసించకుండా నిరోధించే ప్రతిబంధకాలను తొలగింప ప్రయత్నము చేయకపోవ టము. పత్రికలలో ఉపవాసముచేసి అనగా తప్పుగా చేసి మృత్యువాతకి వశమైనవారి చరిత్రలు పడుతూ ఉంటవి. నిజమే. జాతిసంబంధమైనట్టియు ఒక్క మాన వుని జీవిత కాలమంతయు అభ్యసించిన అలవాటులు ఒకటి రెండు వారములలో ఇష్టమై పోవునా? పక్షోపవా సము చేయుటకు లోపలనుండి ప్రేరేపణ ఉండవలెను. రెండవది అందుకు తగిన నేర్పుండవలెను. బలవంతమున తిని ఆహారమెట్లు అపకారము చేయునో, నిర్బంధోప వాసమువలనగూడ అవిధమునవే కీడుగలుగును. రెంటి యందును దేహము, ఆత్మకూడ యెదురు తిరుగుచున్నవి. ఉపవాసము సర్వరోగనివారకమనిగాని లేక యేదో ఒక రోగమును నయముచేస్తుందనిగాని యెప్పుడు సలహా యివ్వగూడదు. ఆకలి లేనప్పుడెట్లు ఆహారము పుచ్చు కొనకూడదో అవిధముగనే ఉపవసింపవలసిన ఆవశ్యకత గానీ, కోరిక సహజముగ కలుగనిదే, ఉపవసించిన కలుగవలసినమేలు కలుగదు. సముద్రముమీద ప్రయా ణము చేయదలచినవారు దోనెపడవమీద ప్రయాణము చేస్తారా? సముద్రములోనికి దిగేముందరే సముద్రమెంత లోతుంటుందో మీకు ముందుగా తెలిసియుండవలెను. మీ ఆత్మయొక్క తోడ్పాటు ఉన్నదో లేదో విచారణ చేసి తెలుసుకొనవలెను. దేవుడు మేలుచేయునులే అని ఊహించుకొని సముద్రములో దిగగూడదు. సము

ద్రిము అపకారముచేస్తే అది నావికుని దోషముగాని సముద్రపుదోషము గాదు.

శివనియమము:

. ఇందుకుసంబంధించిన విషయములన్నియు తెలిసికొని యుండవలెను. కాని వెంటనే వానిని మరిచిపోవలెను. డాక్టరు డి. వి, మిస్టర్ హెస్కెల్, మిస్టర్ మెక్ ఫెడన్. మిస్టర్ హేనిష్, మిస్టర్ షా, మిస్టర్ ప్యూరింటన్ మొదలగువారు రచించిన ఉపవాస సంబంధమైన గ్రంథములను తప్పకుండా చదువవలసినదే. చదివి ఆనందించి మరచిపోండి. ఎందుకంటె నిజమైన ఉపవాసమునుగూర్చి ఆ గ్రంథముల కేమి తెలియును? ఆ గ్రంథాలలో కొన్ని పరిశోధనల ఫలితములు మాత్రమే ఉన్నవి.

పళ్ళోపవాస మారంభించిన తరువాత దేవునిపాదాల సాక్షిగా ఏ ఉపవాస సంబంధమైన గ్రంథములనుగాని అందులోని పేజీలనుగాని త్రిప్పి చూడకుము. వైద్యము చేసికొనే రోగికి కంకాళములు, స్మశానము, దిష్టిబొమ్మ ఉన్న బొమ్మల పుస్తకము చూపిస్తే యెలాగుంటుంది? కొంత మందికి ఉపవాసపు చివరిదినమందు ఫోటో తీయించుకొనవలెనని యుంటుంది. తమ యెముకలపోగు బొమ్మ యెంత అందముగా నుండునో చూచుకొందురు. అదిపోని. ఇతరుల అనుభవములు ఉపవాసములో మనకు విశ్వాసము కలిగించుటకును, ఉపవసించుటకు తగినసాహసమును కలిగించుటకును, తోడ్పడును. వారు చేసిరి. మనమును చేయగలము. వారికి మేలుకలిగినది. మనకును మేలు కలుగును. వారినమ్మకములు వారివాంఛలు అంత

రాత్మ ప్రబోధము వీనిననుసరించి వారు ప్రవర్తింప సాహసించిరి. మనమును అట్లే నమ్మి సాహసింతము. ఆసక్తిగలవారికే ఆ గ్రంథము లుపయోగించును.

## 4వ నియమము

ఉపవాస ప్రయోజనము, తదనుగుణమగు విధానము. నీవు కోరునది ఉజ్జీవనమా? ప్రభుత్వమా? ప్రమోదమా? ప్రజ్ఞానమా? ముఖ్యముగా తెలిసియున్న యెడల నీవు శుద్ధిచేసి బలపరచవలసినవి దేహమా? మెదడా? తెలివియా? ఆత్మయా? ఇంతవరకు సరియైన జవాబు నీకు తెలిసియున్నయెడల నీవు చేయవలసిన ఉపవాస కాలము, విధానము, పరిమితి, పరిస్థితులు, నిశ్చయించుకొనవచ్చును. ఇంతకు పూర్వము ఉపవాసములో యిట్టి వివేచన లేకుండెను. సహజంగానే అందువలన తికమక, సంశయము, పొరపాటు, అపజయము కలిగేవి. ఉదాహరణకొరకు నీ మనోబలమును బలపరిచి ధైర్యాన్ని స్థాపించ దలచుకొంటివి. అందు కనుగుణ్యముగా 10, 20, లేక 30 దినముల ఉపవాసము చేయుటకు నిశ్చయించుకొని తదనుగుణంగా యెన్ని అవాంతరాలు వచ్చినను మానకుండా పాటించవలసినది.

అట్లు కాక దివ్యమైన ఆవేశము కావలెనని కోరుదువేని యేదో ఒకదినము చూచుకొని ఒకదినము ఉపవసింపవలసినది. భగవదనుగ్రహము కోరినవారికి కాలనియమముగాని, ఋతునియమముగాని, లేదు. లేక రోగనివారణము కొరకై ఉపవసింపదలచినచో ఒకే దీర్ఘోపవాసము చేయరాదు. అంతకన్న కొద్దిదినముల పరిమితితో యెక్కువ తూర్లు హ్రస్వోపవాసము చేసినయెడల యింకను

మంచిఫలములు కలుగును. యుక్తమైన ఆహారవిహారములు వలన ఉపవసింప నవసరము లేకయే. రోగనివారణము సాధ్యమైయున్నది. పనిపాటులు చేసికొనుచు యింటి పట్టున నేయుండి రోగనివారణము చేసికొనదలచిన వారికి యీ పద్ధతి మిక్కిలి అనుకూలమైనది. పనిచేసిన యెడల ఆహారము లేకుండా ఉండలేరు. ఆహారము సంపాదించుకొనుటకు పని చేయవలెను. అంతులేని యీ పొరపాటు యిలాఉంటేది.

భర్త, పిల్లలు, ఉన్నయిల్లాలు వళ్యోపవాసము చేయవలసినయెడల ఆమె యేమిచేయవలెను? అని తరుచు అడుగుచుందురు. ఆమె చేయజాలదు, అని నా జవాబు. మెల్లదిగా బోధించి ఆమెభర్త దినమునకు రెండుతూర్లే భుజించునట్లు అలవాటు చేయవలెను. సంసారపుస్త్రీకంటె యీ ప్రపంచము మొత్తముమీద తిండిలో బుద్ధిలేని అమితత్వముగలప్రాణి ఒకటియున్నది. అదియేదో తెలుసునా? వ్యాపారస్థుడు, తన అమితత్వము తనకే తెలియదు. తెలిసికొనదగిన వేవియు అతనికి తెలియనే తెలియవు. నీవు చెప్పదలచినచో సమయానుకూలమైన మాటలతో కుతర్కముచేసి దానిని ఓడిస్తాడు. ఎప్పటికైనను మూఢమానవుడు అను గ్రంథము వ్రాయదలచినాను. సృష్టిలో ఇట్టి మూర్ఖజంతువ యింకొకటి లేదు.

ప్రేమమయింటిలో బుద్ధిగలిగినవారు తమ కిష్టము వచ్చినట్లు ప్రవర్తించుటకు వీలున్నది. నిర్వివాదముగా పోవచ్చును, రావచ్చును, ఆలోచించవచ్చును, ప్రవర్తింపవచ్చును. ఎవరైనను మనవ్యాధిగాను, ఆ శుద్ధిగాను, వళ్యోపవాసము చేయదలచినవానికి తప్పకుండా

వసతులుంటవి. మన విశ్వాసము మనసెప్పుడును బంధించదు. భయమే మనను బంధించేది. విశ్వాసము మనను ముందుకు తీసుకొనిపోవుచుండును. మనధైర్యము యెంత గట్టిగానుంటే విశ్వాసము మనను అంత వేగముగా ముందుకు తీసుకొనిపోవుచుండును.

ఇంటిలోగాని ఆఫీసులోగాని పనిచేయుచో మనము చేయుపనినిబట్టి ఉపవాసనియమములను ఏర్పరచుకొనవలసినది. దేహమనోబలములను యెక్కువగా వ్యాయామము చేయవలసినపనియైనయెడల ఫలోపవాసము మానండి. లేదా వాయిదా వేయండి. కాక మార్చుకొనియైనను చేయవచ్చును. బాగుగా పనిపాటలు చేసికొనే వ్యాపారస్థులుకూడ 20, 30, దినములు ఫలోపవాసముచేయుట కద్దు. 40 దినములు ఉపవాసముచేసిన వారున్నూ ఉన్నారు. మనోబలము, సంకల్పశుద్ధి, వీనిపై సర్వము ఆధారపడియున్నది. ఒక్కముక్క చెప్పెదను. నేను వ్రాసిన నియమములు జాగ్రత్తగా చదవండి సత్యము ప్రేమ అవి మంచివేనని తోచింపజేసినయెడల అనుసరించండి. లేకుంటే నియమాలను ఉల్లంఘించండి. అప్రమాణమని త్రోసివేయండి. అతిక్రమించండి.

5 వ నియమము

ఫలోపవాసము చేయుటకు శిశిర వసంతఋతువులు మంచివి. దీనికి 4 కారణములున్నవి.

1. కూరగాయలు, అప్పుడు పండినపండు, యీ కాలములో లభించును. ఉపవాసానికి ముందు వెనుక వీనిని

తినుట చాల అవసరమైయున్నది. ఉపవాసమునకు ముందు పండ్లు, కూరగాయలు తినుటవలన దేహమునందు గడ్డ కట్టియున్న మాలిన్యములు కరిగి బహిష్కరింపగా పలుచ బడును. ఉపవాసానంతరము తినిన పండ్లు కూరగాయల వలన ఉపవాసకాలమున హరించిపోయిన శక్తియుక్తులు త్వరగా చేకూరును. ఎండించి డబ్బాలలో నిలువచేసిన పండ్లు మొదలగునవి, శక్తిహీనములై పోషణ సామర్థ్య మును కోల్పోవును. అందువలన ఆహారనియమము చేయ దలచినవారికి ఆయా పదార్థములు వాని సహజస్థితిలో లభించి నప్పుడే వినియోగించుకొనుట యుక్తము.

2. వాతావరణ శీతోష్ణస్థితులు, దేహమునుండి మాలిన్య ములు వెడలిపోవుటకు అనుకూలముగా నుండును. శిశిరవసం తములయందు ప్రత్యేక ప్రయత్నములు లేకనే దేహమునందు చెమట పుట్టును. గాలిలో చల్లదనమున్న యెడల ఉపవాసచికిత్సకు ప్రధానాంగమైన స్వేదకర్మ కృత్రిమ సాధనములవలన అనగా వేడిగాలి, నీటియావిరి వేడినీటికాపడము చేయవలసి యుండును. ఈ పద్ధతులు సహజమైనవి కావు. తప్పకుండా కొంత నాడీశక్తి వ్యయమైపోతుంది. లేక అతపస్నానములు చేయదలచి నను గాలి చల్లగా నున్నప్పుడు బాగుగా పని చేయవు. మాలిన్యములను వెలువరించి, నూతనశక్తిని ప్రసాదించే అతపస్నానములు శిశిరవసంతములలో యెక్కువ ఫల దాయకముగా నుండును.

(3) శిశిరవసంతములలో తాపజ్వరములు వచ్చుట సహ జము. అనగా దేహమునందు సహజముగా చైతన్యము ఉత్తమంగా ఉంటుంది. అందుకు వర్షోపవాసములో

ప్రత్యేకముగా శ్రమ చేయనక్కరలేదు. ఆ చైతన్యమే, జీవామాలిన్యాలను వెలువరించుటకు సరిపోవును. శేషిం చిన రక్తమాంసములను కాపాడుటకున్నూ సరిపోవును. వేసవిలో చురుకైనపనులు పెట్టుకోక వినోదము, విశ్రాంతి తీసుకొనుట యిందువల్లనే యేర్పడియున్నది.

(4) ప్రకృతి ఆనందదాయకముగా ఉంటుంది. ఇంట్లో గూర్చుండుట కిష్టముండదు. తోటనీటిలో ఈతకొట్టుట కిష్టముంటుందా? ఆ విధముగానే వర్షోపవాసము చేసే వారు మూలగదిలో పండుకొనరాదు. విముక్తి పొందదల చిన ఆత్మముందుగా గృహబంధనములలోనుండి ఆరుబయ టకు పోవలెను. శాశ్వతము అనంతముఅగు విశ్వములో నికి అడుగుపెట్టవలెను. వసంతము వేడిగానుండిన యింకా కొన్ని చల్లని మేఘాలుండనే ఉంటవి. వర్షోపవాసము ఒక యజ్ఞమువంటిది. సాధ్యమైనంత అనుకూలమైన పరిస్థి తులనుకల్పించుకొనిచేయు వర్షోపవాసము ఒక యజ్ఞము వంటిది. సాధ్యమైనంత అనుకూలమైన పరిస్థితులను కల్పిం చుకొని వర్షోపవాసము సుఖప్రదము చేసికొనవలసి యున్నది. ఏలాగో సరిపుచ్చుకుంటూ చేయగూడదు.

శివ వి య మ ము

దీర్ఘోపవాసము చేయుటకుముందు, కొన్ని హ్రస్వోప వాసములు చేసి సిద్ధము కావలెను.

మొదటనే దీర్ఘోపవాసము చేయ తలపెట్టినచో ఉప వాసపు రెండవదినముననే మరణింతుననుసి యనుకలు గును. ఇంకను 20, 30 దినములు ఉపవాసము చేయుట యెంతకష్టముకి 2, 3 దినము లుపవాసమునుచే సక్రమ

షముగా ముగించినవారికి దీర్ఘోపవాసము చేయుటకు ధైర్యములో కలుగుతుంది. ఏప్రి మే నెలలలో ఒక వారము ఉపవాసము జయప్రదంగా చేసినవానికి జూలై ఆగష్టు నెలలో 30 దినములు దీర్ఘోపవాసము చేయుటకు ధైర్యము ఉంటుంది. పైనియమము పిరికివారికి. ధైర్యవంతులకు యీ నియమమక్కరలేదు. నామట్టుకు నేను బుద్ధిపూర్వకముగా ఒక్కరోజెప్పుడు ఉపవసింపలేదు. నా మనోబలమట్టిది. అందువలననే హరిః ఓం అని మొదటగానే నెల ఉపవాసము చేసితిని. ఇది కష్టమైన ఆత్మవ్యాయామము మాత్రమగును. నాకా యాత్మశక్తి యున్నది. బాధలను చిరునగవుతో ఓర్చుకోగలను. అపజయములోనుంచి జయమును సంపాదించాను. నాశక్తి యెంతో నాకు తెలుసు. పరిమితులుగూడ తెలుసు. ప్రమాదకరముగను, అపకారముగను యితరులకు కనపడేవి నాకు సామాన్యమైనవి, సహజమైనవి అయినవి. శ్రమ యెంత యెక్కువైతే సిద్ధిగూడ అంత గొప్పగా ఉంటున్నది. నీబలమును గూడ నీవు పరిచూచుకొని తదనుగుణముగ వర్తించుము.

7 వ నియమము

నిర్బంధమైనది కాకుండా నీకు హితవుగా ఉండే పనిగూడ యేర్పరచుకో.

సంపూర్ణంగా విశ్రాంతి తీసికొనలేవనియు సంపూర్ణంగా సోమరివై ఉండలేవనియు ఏదోపని పెట్టుకోమన్నాను గాని, నీవు యేపని చేయవలెనని లేకపోతే సుఖముగా పండుకొని విశ్రాంతి తీసికో, నీఅంతర్వాణి

ప్రబోధించినచో ప్రబోధము విను. నీ ఆత్మయొక్క ఆదేశాన్ని అనుసరించు. బయటి నియమముల ప్రకారమేమి చేయకుము. నీకు హితవుగా ఉంటే పనిచేయుము. ఆడవలయుననితోస్తే ఆడుకో. చదువుకోవలయునని ఉంటే చదువుకో. నీకిష్టమైతే విశ్రాంతి తీసికో. నీకిష్టమైతే స్వప్నములు కను. మొదట మొదట తీవ్రమైన తలనొప్పి వస్తుంది. అప్పుడప్పుడు నీరసము దౌర్బల్యము వస్తవి. అవి నీకు భయప్రదమైనవి కావు. కాని విసుగు కలిగిస్తవి. రాత్రిలయందు నిద్రపట్టవచ్చు. నీచుట్టుపట్ల నెంతోమంది నీ ఉపవాసాన్ని ఒప్పుకోరు. వారికేమి తెలుసు? నిన్ను వారి యిష్టప్రకారము నడవమంటారు. ఉపవాస కాలములో వారితో కలిసి తిరుగక తప్పనిచో నీ ఉపవాసము సాగనీయరు. వారిమాటలువింటే ఉపవాసమునకు నీళ్ళు ఒదిలిపెట్టవలసినదే. అట్లు వారిమధ్య ఉపవాసము చేస్తే శుభమునకు బదులు నష్టమే కలుగుతుంది.

## 8 వ నియమము

ఒంటరిగానుండుము. లేక అపరిచితులమధ్య నివసింపుము.

ఒక సామెత ఉన్నది. ఎవరికైనా ఎక్కువగా సలహా యియ్యి. విరోధము తొందరగా వస్తుంది, ఉపవాస కాలములో స్నేహితులవలె వచ్చి మనకు ప్రేమగా సలహా యిచ్చేవారంతా మనకు అత్యంత విరోధులే. శీఘ్ర చనిపోవుదువని వారికి ఆందోళన కలుగకపోవచ్చు. అప్పుడైనా చూచుకుంటారా? నీకన్నులు పీకుకుపోయినవి. నీబుగ్గలు గుంటలు పడినవి. నీ ఒంటిలో ఏలాగుం

టున్నది—యీ మొదలైన సంభాషణలతో యే విశ్వాసము లేకపోతే ఉపవాసము జయప్రదము కాదో అట్టి విశ్వాసము నీలో లేకుండా అంతరింప జేయుదురు. ఈ మిత్రత్వము ఒకరోగము. దీనికి నివారణోపాయము కనిపెట్టిన వారు లేరు. పుట్టుకతో వచ్చి చావుతో వదిలే రోగ మిది.

ఎప్పుడో ఉపవాసము చేయదలచుకున్నావనకూడ స్నేహితులతో చెప్పబోకుము. సక్రమముగా నీ యభిప్రాయములను అర్థము చేసికొనగలిగిన స్నేహితుడొకడు జన్మాంతర సుకృతమువల్ల నీకు లభిస్తే అప్పుడు చెప్ప వచ్చు. కాని సామాన్యంగా అటువంటి స్నేహితుడున్నా దొరకడు. దొరికి అతనుప్రక్కనుండి ధైర్యము గొల్పుచు సలహాయిస్తూయుంటే యెంత హాయిగా ఉంటుంది?

ఏ దేశముఅయినా వెళ్లు. నివసించడానికి వీలుగా నుండే పడవ ఒకటి అద్దెకు తీసుకొని అందులో నుండుము, దూరముగానుండే రైతుయింట్లో పగలల్లా ఉండి రాత్రిపూట మాత్రము యింటిలోకి రా. లేకపోతే ఒక బెడ్డింగులో కావలసిన కొద్ది సామానులు చక్కబెట్టుకొని దూరముగా, ఏకాంతముగా, సముద్రతీరములోనో, పర్వతాలమధ్యనో ఉండి ఒక యింటికి బోయి అక్కడ ఉపవాసము ఆరంభింపుము,

స్నేహితుల అల్లరే కాకుండా దినమునకు 3 తూర్లు ఆహారము తినేవారిమధ్య ఉంటే యింకొకచిక్కు గూడ ఉన్నది. వారు తినుట చూచియు, పచనకాలమునందు

వాసన వాఘ్రాణించియు, అన్నము జ్ఞాపకమువస్తుంది, అన్నముసంగతి బొత్తిగా మరిచిపోతేతప్ప దీర్ఘోపవాసము జయప్రదముగా చేయలేము. అన్నము తినవలెననే భ్రాంతి కలుగుతుందని మాత్రమే కాదు, ఉపవాస కాలములో మనస్సు చాల ఉన్నతవిషయాలలో విహరిస్తూ యుండవలెను. ఆహారము తినవలెననే భ్రాంతి కలగడము, ఆ భ్రాంతిని జయించుటకు మనస్సు పెనుగులాడుచుండుటయు, పై స్థాయికి అనుకూలము కాదు.

ఇంకొక కారణము కూడ నున్నది. మనస్సును ఉన్నతస్థాయికి తీసికొని పోవుటకు మోహైన పరిసరములలోనుంచి దానిని తప్పిస్తేగాని అది పైకి ఎగురదు. పాతసంకల్పాలు, ప్రాత వాంఛలు, ప్రలోభాలు, నీ యున్నతదృష్టికి ప్రతిబంధకముగా నుండకూడదు. విజ్ఞానవిదులు ప్రతివస్తువునకు ఒక ఆవరణ వుంటుంది; ఆవస్తువుయొక్క మంచి చెడ్డలు ఆ యావరణలో యిమిడియుంటవి అని చెప్పుదురు. ఒక కుష్ఠురోగి ఒక యింటిలో ఉంటే ఆ యిల్లుగూడ మనకు దుఃఖప్రదమైన శాపముగా నుంటుంది. ఒక పూజామందిరము ఉంటే, ఆ మందిరము శాంతిప్రదమైన వరముగా వుంటుంది. దీర్ఘోపవాసము జయప్రదము కావలెనంటే ఏకాంతముగా ఉండి ఉపవాసము చేయువలెను.

## 9 వ. నియమము.

ప్రకృతికి సమీపముగా నుండుము. సుఖముగా భరింపగలిగినంత, యెండను అనుభవించుము. అప్పుడప్పుడు ఉదరమునకు మట్టి పట్టీ వేయుము. మట్టి నేలమీద యెక్కువకాలము వెల్లకిల పరుండుము. చిన్న

వాగులలో యీదులాడుము, సముద్రపునీటిలో గంతులు వేయుము. గరికమీద పండుకొని నిద్రింప నలవఱచు కొనుము. ఇంకా కొందరు ప్రకృతి అభిగాము లున్నారు. మట్టి త్రవ్వి ప్రక్కకు తోసి ఆ గోతులలో పరుండెదరు. రోతగా నుండునని తోచుచున్నది. కాదూ! అయితే అది చేయబోకండి. మన దేహమును అన్నము ఒక్కటే పోషించుటలేదు. గాలి, వెలుతురు, మన్ను, నీరు యివన్నీ పోషిస్తున్నవి. ఉపవాసకాలములో అన్నము మానివేయుము, మిగతా పోషక ద్రవ్యములతో దేహమునుపోషించుటకు శ్రద్ధతీసుకొనుము. పువ్వులవాసన, మందమారుతపవనము, నూతనోజ్జీవము నిచ్చును. మట్టికి సమీపమున శయనము చేసినప్పుడు దేహమునకు బలము కలుగుతుంది, సూర్యకాంతి శాంతినీ శక్తినీ యిస్తుంది. చచ్చు ఆహారము కడుపుకు వేసిన దానికన్నా ప్రకృతిలో యింకా యెక్కువ బలమైన ధాతువులతో దేహధారణ చేయుటకు వీలున్నదనే సంగతి మనకు యెప్పుడు తెలుస్తుంది? అన్నము ఆత్మకు ఆహారము కాదనియు, ఆత్మ, దేహములనునవి వేరు తత్వములనియు తెలిసినప్పుడు అనుభవములోనికి వస్తుంది.

## 10 వ నియమము

వకోపవాసమును యితర ప్రకృతి చికిత్సలతో కలుపకుము.

నైపీయ జలచికిత్స, మెక్ఫేడన్ వ్యాయామచికిత్స మొదలగునవి మంచివేగాని అందులోగూడ కొంత ధాతుశక్తి వ్యయమవుతుంది. వానిని వకోపవాసముతో కలిపి చేయగూడదు.

ఒకనికి కాలికమగు ఆమవాతముండెను. ఒక ఉపవాస చికిత్సా పండితుని సలహాతో అన్నము తినుట మానెను. సుఖముగా నుండెను. అంతకన్న త్వరగా రోగనివారణ చేసుకుందామనుకున్నాడు. వేడిగాలి చికిత్సకుని సలహా గూడ తీసుకొని వేడిగాలి చికిత్స గూడ చేయ నారంభించినాడు. చనిపోయినాడు. నీవు చంపినావు అంటే నీవు చంపినావని రెండురకాల వైద్యులూ, నిందించుకొనిరి. ఇద్దరూ ఖ్యాతిగల వైద్యులే. ఇద్దరికీ చికిత్సా నియమములున్నవి. ఒక్క ఉపవాసము చేసినను, లేక వేడిగాలి చికిత్స విడిగా చేసినను అతనిరోగము నయమయ్యేది. ఇద్దరూ కలిసి వాని దేహమునుండి మురికిని పూర్తిగా తీసివేసిరి. ధాతుశక్తిని గూడ తొలగించిరి. రోగి దేహములో యేమీ మిగులలేదు. నిర్మలమైన శవము మాత్రము మిగిలి నది. ఇదే వైద్యమని అందుము.

ఒకవారము ఉపవాసము జరిగిన తరువాత మీ బల ప్రదర్శనము చేయుదమనుకోవద్దు. అప్పుడిక శక్తిని విలువ జేసికోవలసి యున్నది. వ్యయము చేయకండి! నిమిషములు తమంత జరిగిపోవుట చూస్తూ వుండటం నేర్చుకోవాలి. ఇదివరకే నేర్చుకొనకపోతే నేర్చుకొనుటకు ఉపవాసకాలము యోగ్యమైనది. మానసిక, దైహిక, ప్రశాంతి వలన, వళ్యోపవాసమువలన జయమంతయూ చేకూరును. అందువలన దైహిక, మానసిక ఉద్రేకములు లేకుండ విశ్రాంతి తీసుకొనవలెను.

## 11 వ నియమము

ఉపవాసమును మానిన వారముదినములు సులభముగా సులపాచనము కాదగిన ఆహారములనే తినవలెను.

ఉపవాసకాలమున కొన్ని వారములు మలబద్ధక ముండును. అట్టివి లేకుండా చేసికొనవలెను. ఉపవాస కాలము దేహమునం దెక్కడెక్కడనో ఉండు మలము లన్నియు జీర్ణమండలములోనికి చేరుకుంటవి. అవి ఉప వాసకాలమున పూర్తిగా వెడలిపోక జీర్ణమండలములో దాగి ఉంటవి. తినపదార్థముల తాలూకు పిప్పిమా త్రమేగాక ఉపవాసకాలమున జీర్ణమండలములోనికి చేరి దాగియున్న మలములనుగూడ వెలుపరింపవలసి యున్నది. అందువలన ఉపవాసమునకు ముందువార ములో తిను ఆహారము నిలువచేయని పండ్లు అనగా తొటాపండ్లు, లేత కూరగాయలు కొద్దిగా చముట కాయలు, గట్టి రొట్టెమాత్రమే. వానినైను బాగుగా నమలి తినవలెను. బాగుగా నమలని పదార్థములు జీర్ణ మండలములోని ఆంత్రరసములతో బాగుగా కలియక పేగులలో నిలిచి మురుగుపుట్టును. తినునప్పుడు నమల నముల సంఖ్య యెంత తగ్గినకొలదిని ఆహార పరిమితిగూడ తగ్గవచ్చును. నములకుండా వడిగా తినువారు తప్ప కుండా యెక్కువ తింటారు.

## 12 వ నియమము

ఉపవాసమునకుతోడు ఆలోచించుకొనుటకు యింటి కేదైనా విషయముకూడ ఉండవలెను.

నీవు ఏమియూ ఆలోచించుకోకుండా ఉండగలిగితే మరీ మంచిది. కలలుగంటేగూడ మంచిదే. కలకూడ కనలేకపోతే కునికిపాట్లైనా పడుట మంచిది ఏమైనా మనస్సుయొక్క కల్లోలము తగ్గుట అవసరము. అప్పుడు అంతరమందున్న ఆత్మవాణి వినబడును. ఈ లోకము నందలి పాంచ భౌతిక వాంఛలలో మనస్సు తిరుగుతూ యున్నంతకాలము నీ మనస్సుగూడ మానవదేహానికి సంబంధించిన మితులలోనే కూపస్థమండూకమువలె తిరుగుతూ యుంటుంది. ఎంత కాలము ఆహారపుభ్రాంతి నీకుంటుందో అంతకాలము వికారముగూడయుంటుంది. నీ దేహములో మురికి యెంతకాలము శేషించియుంటుందో అంతకాలము ఆహారవాంఛ కలిగినప్పుడెల్ల వికారముగూడ కలుగుతూనే యుంటుంది. మన అసలైన ఆకలి తెలియుటలేదు. ఆయా వేళలయందు అలవాటు చొప్పున ఆకలి యనిపిస్తుంది. ఆ దొంగయాకలికి యేదో తింటాము. ఆహారము తినుటవలన కలుగవలసిన ఆనందమును మన మనుభవింపుటలేదు. ఒక్కసారి తినుట ఆపివేసినప్పుడు వేళకువచ్చే దొంగఆకలి ఆగిపోతుంది సంవత్సరముల తరబడిగా దొంగఆకలికి లోబడి తిని జీర్ణముకాక దేహములో దాగిన ఘనమలిన పదార్థములన్నియు ద్రవములుగాను వాయువులుగాను రూపాంతరము పొందును. అవి మెదడును చుట్టుకొనుచు నాలుకపై పొరపెట్టును. రక్తముతో కలిసి ప్రవహించును. నాలుకలో రుచి గ్రహణశక్తి నశించును. ఇట్లు.

మాలిన దేహమునందలి మాలిన్యములు వెడలిపోవువరకు సరియైన ఆకలి కలుగదు. నిజమైన ఆకలి కలుగువరకున్ను ఆహారమునుగూర్చి తలంచుటకు మనకు అధికారములేదు.

మన మనస్సును భౌతికవిషయములనుండి మరలించి దేవలోకములలో త్రిప్పగలిగినవానిలో సంగీతము ప్రధానమైనది. చేతనైతే నీవే సంగీతము పాడుము. జంత్రమును పాడించి ఆనందించుము. శిశువుల చిలుక పలుకులు యువతుల మంజులాలాపములు నీకు ఆనందదాయకమైతే అనందించుము సముద్రము, పర్వతములు, సూర్యచంద్ర నక్షత్రములు:-యివిగూడ సహజసిద్ధమైన ఆనందదాయక సామగ్రియే వీనినైనను అనుభవించుచు ఉపవాసమును మరచిపోవచ్చును.

కావ్యములు, పురాణములు, ఆత్మగ్రంథములు, నూతన సత్యమును ఆవిష్కరించునట్టియు, వైజ్ఞానిక గ్రంథములు నీకు తోడ్పడును. ఏ గ్రంథములు చదువుటవలన నీమనస్సు వికసించునో, మనోవేగములు సుస్థితికి వచ్చునో భక్తి విశ్వాసములు వృద్ధిపొందునో అట్టి గ్రంథములను ఉపవాసకాలమున పఠన పాఠన, శ్రవణ మననాదులు చేయుట మంచిది.

## 13 వ నియమము

ఉపవాసపు మొదటి మూడుదినములు దేహమల విమోచనకు వినియోగించవలెను.

అనగా మలము, మూత్రము, స్వేదము, కఫము మొదలగునవి బాగుగా వెడలిపోవునట్లు ఎనిమా, కటి స్నానము; ఆతపస్నానము; వమనముఅనగా వేడినీరు త్రాగికక్కుట మొదలగునవిచేయవలెను. వీనికితోడుగా ప్రాణాయామము, ఉదరమర్దనము, ఎక్కువగా నీరు త్రాగుట-యింతకన్న తేనెతో తీపిచేసిన నీటిలోనిమ్మరసము కలిపిత్రాగుట మంచిది ఈవిధముగా ఉపవాస కాలములో జీర్ణమండలములో చేరిన మలాములను వెలువరించుకొన వలసియున్నది. లేనియెడల ఉపవాసము వలన కలుగవలసిన మేలు కలుగక కీడు కలుగును.

ఉపవాసపు మొదటిరోజున, 5వ రోజున ఆతపస్నానము చేయవలసినది. మొదటి వారములో ప్రతి దినము ఉదయము ఒకటి తరువాత నొకటిగా రెండు తూర్లు ఎనిమా చేయవలెను 10 నిమిషముల పరిమితికల చన్నీటి కటిస్నానము ప్రతి ఉదయము చేయవలసినది ప్రతిదినము మధ్యాహ్నము ఉదరమునకుగాని దేహము నంతటికిగాని మృదువైన మర్దనము చేయవలసినది. ఓపిన కొలది సాయం కాలములయందు ఆరుబయట గాలిలో నడువవలెను నెమ్మదిగా గాలిని లోనికి పీల్చి కొలది కాలము ఆపియుంచి అట్లే నెమ్మదిగా వదలుచుపీల్చుచు నడువవలెను. రేచక పూరక కుంభక

ములు మిక్కిలి నెమ్మదిగా చేయుచు నడువవలెను. దినమంతటిలోను కనీసం 2 సేర్ల నీటిని త్రాగవలెను. తేపకు పావుసేరు నీరుకంటె యెక్కువ త్రాగవద్దు. దినము మొత్తముమీద 15 తులముల నిమ్మరసమును 45 తులముల నీరు అనగా 6 ఔన్సుల రసము, 18 ఔన్సుల చొ॥ నీటిలో కలుపుకొని ఎడనెడ 4 గేసి ఔన్సుల చొ॥ త్రాగవలెను, త్రాగు నీరంతయు నిమ్మరసముతో కలిపిన నీటితో సహా 2 సేరులుగా నుండవలెను. నీటితో కలిపిన నిమ్మరసముకంటె నీరుకలపని తీయని నారింజరసము మంచిది. పచ్చిద్రాక్ష, అనాస, దానిమ్మ, దబ్బ మొదలగువాని రసమైనను పనికివచ్చును. అన్నిరకముల పండ్లరసమును త్రాగవద్దు. ఏదైన ఒక్కొక్కరకము పండ్లరసమే త్రాగవలసినది. త్రాగునప్పుడు ఏ పండ్లరసమైనను దినమునకు 6 ఔన్సులు చాలును. అంతేగాని పండ్లరసము కూడ, అసహ్యము కలిగేటంత యెక్కువగా త్రాగవద్దు. దేహమును మనసును చుట్టివేసిన మాలిన్యముల ఒత్తిడిని పండ్లరసములు తగ్గించును. పచ్చితీయ్యద్రాక్ష (కిస్మిస్) పండ్లయందు దేహపోషణ సామర్థ్యముగూడ నున్నది గాన ఉపవాసకాలమున దానికన్న నారింజపండు రసము మంచిది. నిమ్మరసము మరీ పుల్లగా నుండి ప్రతిదినము త్రాగుటకు విసుగుగా నుండును, కనుక దానికన్న నారింజరసము మంచిది.

ఏ ప్రయోజనము కొరకు నేను పక్షోపవాసము ఆరంభించితినో ఆ ప్రయోజనము దరిచేరనిచ్చినంతనే పండ్లరసముల క్రమక్రమముగా పెంచితిని. దానితో ఉదరము చల్లబడినది. నా మనసులోని చిమచిమ తగ్గినది.

నాల్కమీద పాచిపోయి యెఱ్ఱబడినది. మనసు నిర్మలమైనది. పండ్లరసము దేహమాలిన్యములను వెలువరించుటకు సహాయపడినది. నా మొట్టమొదటి కష్టోపవాసము చేసినప్పుడు ఒకతూరి 3 వ వారములోను, ఒకతూరి 4 వ వారములోను సాపుగా మలమోచనము అయినది. దీనికి తప్పకుండా నేను స్వీకరించిన ఫలరసములే కారణము.

10 దినములకన్న తక్కువకాలము చేయు ఉపవాసములందెల్ల నారింజ, నిమ్మ, ద్రాక్ష మొదలగు వానిని పిండి వడియబోసిన రసము త్రాగుట మంచిది. ఇట్లు చేసినప్పుడు జీర్ణమండలముల లోనికి చేరిన మలములయందు మురుగు పుట్టకుండ ఆగిపోవును. ఆ మలములు వెలువడిపోవుటకును తోడగును. దేహము త్వరగా నిర్మలమగును. ఆహారమును తినక మానినందున కలిగే వేదన కలుగక మనస్సుకూడ నిర్మలముగా నుండును దినమునకు 3 నారింజపండ్ల రసము త్రాగిన చాలును. అంతకన్న అక్కరలేదు.

## 14 వ నియమము

ధారాళముగా నీటిని వాడుము. సౌమ్యమైన చికిత్సలనే చేయుము.

ఫాదర్‌నీఫ్ చెప్పినట్లు మంచుపడిన పచ్చికమీద పాదరక్షలు లేకుండా నడువుము. కాని అతడు చెప్పిన ధారాస్నానమును మాత్రము చేయకుము. ప్రీస్నిట్జు చెప్పినట్లు శైత్యకములగు పట్టీలు వేయుము. దినము కూనే చెప్పినట్లో, జస్ట్ చెప్పినట్లో ఏదో ఒక స్నానము

చేయుము. నులివెచ్చని నీటితో సౌమ్యముగా జల్లు స్నానము చేయవచ్చును. అంతేగాని దేహధాతువులను వ్యయము చేయునట్టి అతిశీతలోదక స్నానముగాని, తీవ్రములగు పిచికారీ స్నానముగాని చేయవద్దు.

ఉపవాస కాలమున ఒకరు యెంతనీరు త్రాగవలెను అనువిషయమున అభిప్రాయ భేదము లున్నవి. కాని మానవుని సహజ పరిజ్ఞానము వారువారెంతనీరు త్రాగ కలసియున్నది. స్పష్టముగానే తెలియజేస్తూ యుంటుంది. అయితే అసలేనీరు త్రాగనివారికి నీరు త్రాగవలయునను కోరిక కలుగకుంటయును కలదు, అందువలన సుమారుగా గంటకు 4 ఔన్సుల నీటిని తప్పకుండా త్రాగుట మంచిది. మంచిదిగదా యని పొట్టబరువెక్కినను బాధగా నుండినను గూడ విడువక త్రాగమని నా యుద్దేశ్యము గాదు. జీర్ణకోశము శిథిలిజెందిన వారికిని. మూత్రపిండములు రోగగ్రస్తమైనప్పుడును, నీటిపరిమితిని యింకా చాల తగ్గించవలసి యున్నది కొండవాగులనీరు మంచివి. అదిదొరికినను తీయగను, నిర్మలముగను ఉండినచో త్రాగుట మంచిది. లేనియెడల నీటిని డిస్టిల్ చేసి ఆ నీటిని గాలిలో కొంతకాలముంచి త్రాగుట మంచిది. సోడా ఆమ్మేచోట డిస్టిల్ చేసిన నీరు సీసాలలోనుంచి అమ్ముదురు. ఆ నీటిలో ఖనిజములు, మాలిన్యములు, లేవని తెలిసిన తరువాతనే ఆ నీటిని త్రాగుట మంచిది.

## 15 వ నియమము

చికిత్స శాంతముగా నుండవలెను.

రోగముతో బాధ పడేవారు తమ రోగమును ఉప వాసముతో నయము చేసికొన దలచినవారు ఉంటారు. అట్టివారికొరకే యీ నియమము. దీర్ఘోపవాసము చేసే వారికి మాత్రమే బయటివారి సహాయము కావలసియుం డును. ఒక కొంత చికిత్సకుడు లేక మానసిక చికిత్సాశాస్త్ర వేత్తలో యెవరు దొరికినా వారి సహాయము తీసుకొనుము. హస్తచాలనము, మర్దనము, ఆదేశము, స్పందనము విశ్చ యము మొదలగు ప్రక్రియలు నీ కొంతమాటుగా కనబడి నను నిరాకరింపవద్దు. అవి మేలునే చేయును. తెలిసిన వారు ఉదరము, వెన్నుపాము మర్దన చేయుదురు. ఉప వాసకాలమున అదియును మేలుచేయును. రాత్రి పగలు యెంత నిద్రవస్తే అంతనిద్ర భయము లేకుండా రాత్రి పగలు అనుభవింపవచ్చును. మంత్రతీర్థ మిచ్చేవా రున్నారు. వారికి భౌతికశాస్త్రములు రాకపోయినను మన కుండే భగవద్భక్తిని వారు బలపరుస్తారు. అందువలన వారి సహాయముగూడ తీసుకోవచ్చును. అయితే వారికి నీవు ఉపవాసము చేయుచున్న సంగతిని చెప్పవద్దు. వారి కుపవాసములో నమ్మక ముండదు. వారికి తినుట లోనే నమ్మకమున్నది. వారు తమ విశ్వాసమును మన కంటె గట్టి జూచెదరు. [illegible] తాము నజరేన్, క్రైస్తు, అనుయాయుల మందురు. వారికి జీసస్ క్రైస్తు దీర్ఘోపవాసము చేసిన సంగతి తెలియదు. అతడు మాన సిక చికిత్సను, జలచికిత్సను, జోడించి, రోగుల బాధను నివారిస్తూ యుండేవాడు. ఈ సంగతి వారికి తెలియదు. తాము క్రీస్తు అనుయాయులమని చెప్పుకొందురు. వారు అట్లాంటి దలచినారు కాని ఉండలేరు. దీర్ఘోపవాసపు మొదటివారములోనే ఆటలు, వ్యాయామము పనికి

వస్త్రవని. తరువాత నెమ్మదిగా నడచుట, దేహావయవములను సౌఖ్యముగా సంకోచవ్యాకోచములను చేయుట. ఆశ్లే రేచకపూరకములను శ్రమలేనంత వరకే చేయుటకు పనికివచ్చును ఒకవారము చేసే ఉపవాసములో వ్యాయామము చేసినందువలన మేలే జరుగునుగాని యెట్టి ఆపదయును రాదు. దీర్ఘోపవాసము చేసేటప్పుడు మాత్రము దైహికమానసిక వ్యాయామము లేవియు చేయవలెనని యేర్పాటు చేసికోకూడదు. నీ మానవత్వం విశ్రాంతితీసుకుంటే నీ యందలి దైవికశక్తి పని చేస్తుంది.

## 16 వ నియమము

దైశిక బాధలను కనిపెట్టి యుండుము.

అవి మొదట బాధలుగానే కనుపడును. ఆ యాపదనుండియే విజయము గలుగును. దైహికముగను. మానసికముగను, ఉపవాసకాలమున కలిగే బాధ యెంత యెక్కువగా ఉంటుందో ఉపవాసము వలన కలిగే మేలు గూడ అంతకు 3 రెట్లు యెక్కువగా గలుగును. దేహమంతా ఉండి యెన్నో బాధలకు కారణమైన మాలిన్యములవలన కలిగిన దేహస్పందనముల యందలి వైరుధ్యములు తొలగి స్పందనములు సమస్థితికి వచ్చుటయు జరుగునపుడు దేహప్రకృతి యెంతో బలముగాను వడిగాను పని చేయుచుండును. దేహమునందలి మాలిన్యములు తొలగినంతనే దేహప్రకృతి దేహమునందలి ధాతువులను సమస్థితికి తెచ్చి పరిపూర్ణారోగ్యమును కలిగించును.

పైత్యకోశము ఉన్నదనుకొండి. కాలికముగ అందు చైతన్యము తగ్గియున్నది. ఉపవాస కాలమున అందు చైతన్యము కలిగించవలసి యున్నది. వేడినీటికాపు, చన్నీటి ప్రక్షాళనము, తడిపట్టీలు, మట్టిపట్టీ, మర్దన, ప్రాణాయామము, సులభమైన వ్యాయామము, మానసిక చికిత్స మొదలగు వానితో పైత్యకోశమును చైతన్యము కలిగింపవచ్చును.

అగ్నిమాంద్యము, హృద్రోగము, శ్వాసాశయ వ్యాధులు, మానసిక రోగములు మొదలగునవి ఉపవాస కాలమున చేసిన సామాన్యమగు చికిత్సలతో సులభముగ నయమగును. ఈ చికిత్సా ప్రక్రియలు నిజముగా ప్రకృతికి అవసరము. మీరు ఏమీ చేయకుండా ఊరకుంటే ప్రకృతియే ఉపవాసకాలమున సర్వరోగములను నివారింపగలదు. ఈ స్వల్పమగు చికిత్సాప్రక్రియలు చేయుట ద్వారా మనరోగము నయమగుచున్నది అనే ఆశ కలుగుతుంది. ఈ ప్రక్రియలు చేయకపోతే మనరోగము ఎట్లు నివారణ అగునని నిరాశయును కలుగవచ్చును. ఆశ కలుగుటకు నిరాశ పోవుటకు మాత్రమే యీ ప్రక్రియలు చేయుమంటిని. మనస్సును శూన్యముగా నుంచలేము గదా. మెదడునిండా కొరగాని విషయాలెన్నో కూరుకొని యున్నవి. అవి జీర్ణములగు మనస్సుకు పోషణ చేయుటలేదు. అందువల్లనే ఆ తుక్కు జీవితానికి ఉపయోగకారి కావటంలేదు. మెదడులో నుండి యీ తుక్కును తరుచుగా తొలగిస్తూయుంటే, మనస్సులో నిండుతవి, పండుతవి.

## 17 వ నియమము

చిహ్నములను చూచి భయపడవద్దు. వానిని ఆహ్వానింప వలసినది.

చిహ్నములనుచూచి భయపడేవారినిగూడ అపహా
సింపవలసినది. తినకపోతే జీవింపలేనివారంతా తినకుం
డానే జీవింపగలుగుచున్నవారి ముఖముచూచి వంకలు
పెట్టుచున్నారు స్నేహానికిఔదార్యానికి,సౌందర్యానికి,
ఉత్సాహానికి గుర్తుగావారిముఖాలుచూచి నిర్ణయిస్తారేం?
ఇది హాస్యాస్పదముగా లేదూ! వారి ప్రవర్తనచూస్తే
జాలికూడ కలుగుతుంది. అన్నము తినకపోతే చచ్చిపో
తాము అని వారనుకొంటున్నారు. మనయిష్టము వచ్చి
నప్పుడు తిని యిష్టము గానియప్పుడు మాని గూడ
మనము బ్రతుకగలము అనిగూడ రుజువుచేస్తున్నాము.
ఇప్పుడు మనకిష్టములేదు. అన్నముతినుట మానినాము.
అన్నము తినకపోతే చనిపోతాము అనివారనుకొన్నారు.
మనము అన్నము తినకుండాగూడ జీవించియున్నాము.
దానికి వారు విభ్రాంతులగుచున్నారు అది అట్లుండనీ,
పైలక్షణములనుగురించి కొంచెము మాట్లాడుకుందాము.
లక్షణములు అనుటతోడనే డాక్టరు జ్ఞాపకానికివస్తారు.
మనకుంటేరోగలక్షణాలు యెన్ని యున్నవో చూచి
తగినన్ని విషపు మందుల నిస్తారు. నీ యింటిలో నేను
ముంత యెత్తుకువెళ్ళితే మాయింటిలో నీవు దుత్తయెత్తుక
వెళ్ళినావు. ఇది దొంగతనముకాదు! (అనగా దొంగ
తనమే) డాక్టరు యీ విషపుమందులు యెంతో అవసర
మనే నమ్మికతోనే ప్రయోగిస్తాడు. ఒక రోగలక్షణము
దానికొక విషమమందు ప్రయోగించుటఅనేదే ఒక అవ్య
క్తపు సిద్ధాంతము. దీనికి నిజమైన శాస్త్రీయమైన ప్రాతి
పదిక యేమీలేదు. నీకు సత్యము కావలసియుంటే రోగ
లక్షణముల జోలికిపోవద్దు.రోగ కారణములేవో గుర్తుపట్టు,
రోగకారణాలను తొలగిస్తే రోగము తనంతనే పోవును.

ఒక సంగతి చెప్పనీయుడి. ఎంతోమంది తమకు మంచి పండ్లుతింటే జబ్బు చేస్తుందంటారు. పండ్లు సరిపడవు అంటారు. పండ్లతో యెప్పుడు సరిపడకపోవుటలేదు. అవి యెప్పుడూ అపకారము చేయవు. నిజమేమనగా వారి పొట్టలో మాలిన్యములు నిండుకొని యున్నవి. పుల్లని పండ్లు తగిలితే మాలిన్యములు కదలబారి బయటికి వస్తాయి. పండ్లు లోపలి మాలిన్యమును వెలువరించకుండా పోవు కొనవు. అప్పుడు బుద్ధిలేని తిండిపోతు "ఓమాలిన్యమా నిపండ్లుతింటే నీవు బయటికిపోతావు. నేను పండ్లు తినను. నీవు లోపలే ఉండు" అంటాడు. డాక్టరుగూడ మందిచ్చి పండ్లు మాన్పించి మాలిన్యములను దేహములో నిలువ చేస్తాడు. శాస్త్రీయమైన మంచి విధానములో ప్రవీణులైన డాక్టరుగారు చేసిన ఘనకార్యము యిది.

వర్షోపవాసములో బాబాపు, దినమున శాకపాను దేహములో తూకము తగ్గుతుంది. పోయినది దేహము నుండి పనికిమాలిన మురికి, అంగుపు విసర్జింపబడి, ఉపవాసానంతరము పోయిన తూకము తిరిగి యింకా వేగముగా చేరుకుంటుంది. అయితే యిప్పుడు వచ్చే తూకము శుద్ధ రక్తము, గట్టిమాంసము, చేతోవంతమైన నాడీమండలము.

నీవొంటిలో బలముగూడ చాల తగ్గిపోయినట్లు తోచవచ్చు. ఇంత దౌర్బల్యముతో యెలా బ్రతుకుతావా అనిపిస్తుంది. దానినిగూర్చి విచారము పెట్టుకోవను: నీ భయమేగాని నిజముగా ప్రమాదము రాదు. మెదడులో, నాడులలో, కండరములలో, మాలిన్యములు

రోమమాత్రము శేషించియున్నా శుద్ధమైనరక్తము మెండ అగునవి హరించిపోవు.

ఉపవాసారంభములో మెదడు, రక్తము, ప్రేవులు, ఊపిరితిత్తులు, మూత్రపిండములు, చర్మరంధ్రములు-యివి అన్నియు దేహమాలిన్యములను వెలుపలికి నెట్టుచుండుటవలన యేదో దౌర్బల్యంగా ఉన్నట్లే అనిపిస్తుంది. అందువలననే ఉపవాసారంభకాలమున మిక్కిలి అసౌఖ్యముతోను, దౌర్బల్యముతోను, సాగిపోతూయుంటుంది నీకు యెంత అసౌఖ్య ముంటుందో దేహమాలిన్యాలు అంతవడిగా వెలువడి పోవుచున్నవి అని అర్థము. అందువలన యెంత అసౌఖ్యము యెక్కువగా నుంటే అంత యెక్కువ మేలుకలుగుతుందనే నమ్మండి. నీ దేహములో మాలిన్యములు తక్కువగా నుండి నీవు ఉపవాసము ఆరంభించియున్నట్లైతే నీకు అసౌఖ్యము గూడ తగ్గియే యుంటుంది. ప్రకృతి వైద్యులు స్వాస్థ్య సంకటము అని దేనిని అనుచున్నారో అట్టిదే ఉపవాస చికిత్సలో గూడ వస్తుంది. నీ దేహములోనుండే మాలిన్యాలు చాలయెక్కువగా నుంటే ఉపవాసకాలములో వచ్చేస్వాస్థ్యసంకటముగూడచాలతీవ్రముగా ఉంటుంది. అంత దీర్ఘోపవాసము అవసర మయ్యేటంత యెక్కువ మాలిన్యములు దేహములోనుండుటచేతనే ఉపవాసకాలములో స్వాస్థ్యసంకటములు అంత తీవ్రముగా వస్తూయున్నవి. దీర్ఘోపవాసపు మొదటివారముయందు లోకములో నున్నట్లే ఉంటుంది.

ఉపవాసపు 3,4 వారములలోయేమిబాధ లుండవు. సుఖముగా నుంటుంది. స్వర్గమువలె నుంటుంది.

ఎక్కడ పడితే అక్కడ ఆనందము కనబడుతుంది. ఉదరము లావు తగ్గించుకుంటే స్వర్గము కనపడుతుంది. అని నేను మతబోధకులకు సలహా యిస్తున్నాను.

మిక్కిలి లావుగానుండి రక్తక్షీణముతో బాధపడే స్త్రీ ఉపవాసము చేసినప్పుడు తమ ప్రాణమే పోయినదని భయము కలుగుతుంది. భయపడకండి. ఇదివరకెల్లా మీ దేహపు లావునకు కారణమైన మాలిన్యాలలో దయ్యాలు దాగియున్నవి. అవి యిప్పుడు పోవుచున్నవి. నీకు కలిగే బాధలన్నిటికి ఉపవాసము కారణము కాదని మాత్రము గట్టిగా తెలుసుకోనండి. చిరకాలమునుండియు మీ దేహములలో మాలిన్యములు చేరినవి. వానిని వెలువరించుటకు ఇప్పు డుపవాస మవసరమైనది. ఈ ఉపవాసములో మాలిన్యములు వెడలిపోవుచున్నవి. పోవుటలో బాధకలుగుచున్నది. కలిగే బాధలు ఆరోగ్యమునకు హేతువగును అందువలన బాధలనోర్చుకొని ఆరోగ్యమును పొందండి.

మీ చేతినాడినిమిషమునకు 86 సార్లుకొట్టుకొనవలసియున్నది. అది నిమిషమునకు 62 సార్లే కొట్టుకొనవచ్చు. లేచినప్పుడు తల తిరగవచ్చును. వికారముంటుంది. రకరకాల కాయనొప్పులు వస్తవి. మొదటనో, మధ్యనో చివరనో ఊహించటానికి చెప్పటానికి వీలుగాని బాధలు కూడ వస్తాయి. వీనిని చూచి భయపడవద్దు. అవి యెట్లా వస్తాయో అలాగునే పోతవి.

## 18 వ నియమము

సుగుణములు కలుగును అను విశ్వాసముతో చేచియుండుము.

.సున్నితమైనవి స్ఫుటంగా గోచరించవు. ఒకమనిషికి బాధ తెలుస్తుంది. ఒకబిడ్డకు సుఖము తెలుస్తుంది. సుఖము దుఃఖము ఒకే కాలములో కల్గిచూస్తూవుంటుంది. మాతృహృదయము అర్థము చేసికొనుటకు యుగాలు పట్టును. ఆ విధముగానే దీర్ఘోపవాసమువలన కలిగే ఆనందము ఉపవాసకాలములో బాధ పడేటప్పుడు తెలియదు. ఉపవాసము ఆపి ఉపవాసము చేసే సంగతికూడా మరిచిపోయిన తరువాత ఉపవాసము చేయుటవలన కలిగే ఆనందము అనుభవానికి వస్తుంది. ఉపవాసకాలములో ఏంతె అసౌఖ్యానికి గురియైనారో ఏని వన్నిటిని మరిచిపోగలిగినంత నూతనోజ్జీవనము, ఆనందము కలుగునని నేను మీకు స్పష్టపరుస్తున్నాను. ఐహికసౌఖ్యమే కాకుండా మానసిక నైతిక ఆధ్యాత్మిక ఉన్నతి ఉపవాసము వలన లభిస్తుంది.

క్రితం వేసగిలో కొన్నివారాలు పల్లెసీమలో గడిపితిని. అక్కడ ఆరుబయట తిరిగితిని. తిరిగినంత కాలం నాలో ఏమీ క్రొత్తచైతన్యం కలుగలేదు. నగరానికి తిరిగివచ్చాను. ఒక నెలగడిచింతో లేదో 125 క్రొత్త పద్యాలు వ్రాశాను. మేఘాలు నెమ్మదిగా, నిశ్శబ్దంగా చేరుకొని వర్షించిన ట్లే మనలోనుండి చైతన్యము గూడ నిశ్శబ్దముగా, శాంతంగా ఉద్బుద్ధమై ప్రకాశిస్తుంది. అప్పుడే నీలో ఆవేశము కలిగినదని లోకానికి తెలుస్తుంది.

## 19వ నియమము

ఉపవాసమును ప్రార్థనతో ముగింపుము.

దీర్ఘోపవాసము ముగించుట చాల బాధ్యతతో కూడి యుంటుంది. ఈ లోకమునుంచి వదలి ఉపసించుటకన్న ఉపవాసమును ఆపి ఆహారము తీసికొనుటయింకా ఎక్కువ కష్టముగా నున్నట్లు కనిపిస్తుంది ఉపవాసపు మొందటి వారములో అనగా మార్పుపొందే సమయములో జంతు వ్రనమందే సహజపరిజ్ఞానము, యోగికుండే అచంచలమైన ఆదర్శము ఉంటవి. మనిషికి సహజముగా ఉండే సంశయము ప్రలోభము, అపజయము, పోతివి. తిరిగి ఆహారము తీసికొనవలసిన కాలము వచ్చునప్పటికి నీలో సహజ పరిజ్ఞానము ఉండదు. ఆదర్శమునూ ఉండదు. మానవ సహజమైన సంశయాగులు పోవును. అంతా శూన్యంగా ఉంటుంది. అయితే ఆ శూన్యముగూడ ఆనంద ప్రదంగానే యుంటుంది. ఉపవాస కాలములో ఆహారముతీసుకొనే పని లేను గనుక జీర్ణకోశము ముడుచుకుంటుంది. జాతరాది రసాలుగూడ దేహమాలిన్యాలను పక్వముచేసి వెలువరించుటకే వినియోగమగుచుండును. అందువల్ల తినవలసివచ్చినప్పటికి నీవు ఆదివరకు తినుచున్న ఆహారములో మూడవ వంతుకూడ జీర్ణకోశము యిముడ్చుకొనజాలదు.

మొదటితూరి ఆహారము తినువప్పుడు ఒక్కరకపు పండు చాలును. రెండవదినము ఆహారమునకు రెండు పదార్థములు చాలును. 3, 4, 5, 6 దినముల భోజనమునకు 4 రకముల పదార్థములు సరిపోను. తినదగినవానిలో యేదిబాగుగ తినవలెనని యుండునో అదే బాగుగా నమలి ఒక గంటసేపు తినవలెను. తిరిగి ఆహారమునుతినుటకు 6 గంటలకాలమునకు తక్కువకాకుండా వేచియుండవలసినది. ఉపవాసము ఆపుజాడు తినదగిన వస్తువులలో

—తిపిలు, ఆలుబకరా, జలదారు, గోధుమపిండితో చేసిన రొట్టె. కండికట్టు, క్షీర, సార (అసప) పాట్లు, మొదలగు కూరలు వండినవిగాని వండనివి చేరను. నేను ఉపవాసము ఆపినరోజున గోధుమరొట్టె తిన్నాను. ఒక చిన్న రొట్టెముక్క నములుటకు 40 నిమిషములు పట్టినవి. నిజంగా ఆకలున్న మానవుడు నమలకుండా ఆహారాన్ని మ్రింగజాలడు తినినదంతయు రక్తమాంసములుగా మారుతుందిగనుక యితరులు తినే ఆహారములోసగము ఆహారముతోనే ఆతనికి తృప్తికలుగుతుంది. చాలామందికి దొంగ ఆకలి యుంటుంది, వారు తినిన ఆహారములో మిక్కిలి స్వల్పభాగముగూడరక్తమాంసాలుగా మారదేమోని కుపయోగపడదు. అందువలన ఆహారముయొక్క గుణములోను పరిమితిలోను వారియెన్నిక చాలా దోషంగా యుంటుంది. అందువల్లనే వారికి అన్నము తిన్నతరువాత నిస్సత్తువగాను బద్ధకముగాను ఉంటుంది. సహజస్థితిలో తిగిన ఆహారము మితముగాతింటే యెంతోబలము ఉత్సాహము ఉంటుంది. ఎక్కువ అపథ్యమైన ఆహారము యెక్కువగా తినుటవలన దానిని యెట్లోఅట్లు బయటికి చేరవేయుటకు జీర్ణమండలము వంక అవసరమైన దానికంటే యెక్కువ రక్తము ప్రవహించవలసి యుండుటచేతనే తిండిపోతులకు బద్ధకము నిస్సత్తువకలుగుచున్నది.

సహజపరిజ్ఞానమువదలక ఆహారపరిమితిని యోగ్యతను తినవలసిన కాలమును ఆహార కాలమున ఉండవలసినమానసిక స్థితిని సక్రమముగా నియమించుకొన్నయెడల తాను ఉపవాసమునకు పూర్వము తినే ఆహారములో సగము ఆహారము మాత్రమే సరిపోవును.

ఉపవాసాంతమున ప్రార్థన చేయుచుంటిని. ప్రార్థన అనగా వచనములోనో, పద్యములోనో, కీర్తన గానమో భగవంతుని జ్ఞాపకము చేసికొనుటయె ప్రార్థన అని నా యుద్దేశము. ఉపవాసకాలమున వికసించిన మనస్సునకు గోచరించిన అపూర్వము ఒకసారి జ్ఞాపకము చేసికొని ఆ యనుభవమువెంట జీవితమును ఒరుపుకొనుటకు గట్టి నిశ్చయము చేసికొని ఆహారము పుచ్చుకొనవలెను. ప్రతిముద్దలోను పరమేశ్వరుని దివ్యశక్తిని భావించుకొనుచు భుజింపవలెను. భుజించు జంతువులకు వలె మనకును ఆహారానందము కలుగుతుంది. దానికితోడుగా దేవతలకుండే దివ్యమైన ప్రేమకూడ మనకు ఆహారమువలన లభిస్తుంది.

## 20 వ నియమము

జీవితములోకలుగబోయేమార్పులకునెమ్మదిగానాందిమము.

ఒక వారముపవాసము చేసినవానికి గూడ వ్యక్తిత్వములో మార్పువస్తుంది. శారీరక, మానసిక, నైతిక, ఆత్మీయ స్థానములలో ఎంతో ఆనుకూల్యము గోచరిస్తుంది. విషయములు వెనుకటివలె కన్పింపవు. అదివరకు అస్పష్టముగా ఉండే సత్యం సుస్పష్టంగా గోచరమౌతుంది. మోహముగా అస్వాభావికముగా, అనవసరముగా, వికారముగా ఉండేవానియందు ఉంటూవచ్చిన కాంక్ష అదృశ్యమౌతుంది. నీకు స్వస్థితిగోచరమౌతుంది. ప్రపంచము శూన్యముగా తెలుస్తుంది, సత్యము స్రోత జాగృతుంది ప్రేమ శక్తినిస్తుంది, అని నీకు తెలుస్తుంది.

నిన్ను నీవు తెలిసికొనుటకు ముందున్న బంధాలన్నీ సడలిపోతవి. నీవు ద్విజుడవౌతావు. నిష్కాపట్యము అనే

